

ఏడువకు! ఏడువకు! నా చిట్టిపాపా!
ఇప్పుడే వస్తాడు నీ గాంధిబాబా!




సంచాలకుడు : చక్రపాణి

| సంపుటి 2 | మార్చి, 1948 | సంచిక 3 |
|---|---|---|

## ఏడువకు! ఏడువకు!!

తొలికోడి కూసింది, తెలతెల్లవారింది
ఏడువకు! ఏడువకు! నాచిట్టిపాపా!
ఇప్పుడేవస్తాడు నీ గాంధిబాబా!

యమునమ్మ తల్లికి ఏబాధకలిగిందొ
కన్నీళ్లుపెట్టుకుని కబురు పంపించింది
కబురందుకున్నాడు కదిలి తావెళ్లాడు
తెల్లవారేలోన తిరిగొస్త నన్నాడు.

తొలికోడి కూసింది, తెలతెల్లవారింది
ఏడువకు! ఏడువకు! నాచిట్టిపాపా!
ఇప్పుడేవస్తాడు నీ గాంధిబాబా!

కొప్పరపు సుబ్బారావు



# మన జేజి

## కస్తూరిబాయి గాంధి

ఇప్పటికి 79 సంవత్సరాలక్రిందట పోర్బందరులో 2-10-1869 న ఒక అబ్బాయి పుట్టాడు. ఆ అబ్బాయితల్లిపేరు పుతలీబాయి. తండ్రిపేరు కరంచందుగాంధి. ఆ అబ్బాయి పేరు మోహనదాసు. ఈయనే మనకు గాంధితాత; ప్రపంచానికి శాంతిదూత.

గాంధి తాత ఈ ప్రపంచంలో రెండుపనులు చేయటంకోసం అవతారం ఎత్తినట్టు తోస్తుంది. ఒకటి మనకు స్వతంత్రంసంపాయించటం; రెండు ప్రపంచానికి శాంతినివ్వటం.

గాంధితాతయ్య పెద్ద తెలివిగలవాడు కాడు. కాని ఏ కార్యమైనా కష్టపడి సాధించే వాడు. అయన అబద్ధం ఆడేవాడు కాదు; ఒకరిని బాధపెట్టేవాడు కాదు.

గాంధితాతయ్యకు చిన్నప్పటినించి దేశభక్తి ఎక్కువ. ఇంగ్లీషువాళ్లను మన దేశంనించి వెళ్లగొట్టాలని అనుకునేవాడు. అయితే తాతయ్య బలహీనుడు. అంచేత బలం తెచ్చుకోవటానికి మాంసంకూడా తిని, తర్వాత చాలా నొచ్చుకున్నాడు.

గాంధితాతయ్యకు చిన్నప్పుడే పెళ్లి చేశారు. అయభార్య, అంటే మన జేజిపేరు కస్తూరిబాయి. ఆమె ప్రతి కష్టంలోనూ సుఖంలోనూ తాతయ్యకు తోడుగా ఉండేది. అనేకసార్లు జైలుకు వెళ్లింది. ఆఖరుకు ఆమె జైలులోనే, నాలుగేళ్లక్రిందట చనిపోయింది.

# మన తాత

## మోహనదాసు గాంధి



తాతయ్య చాలా దుఃఖపడ్డాడు. కాని వెంటనే తెప్పరిల్లుకున్నాడు. తాతయ్య ఈ ప్రపంచంలో నెరవేర్చవలసినపనులు ఇంకా కాలేదు. అంచేత రెట్టింపు ఉత్సాహంతో మళ్లీ కార్యరంగంలో ప్రవేశించాడు.

1947 అగస్టు 15 తో తాతయ్యపని ఒకటి అయింది. మనకు అయన స్వాతంత్ర్యం ఇప్పించాడు.

ఇక ఒక్కటి మిగిలింది. ప్రపంచంలో హింసా, హత్యలూ లేకుండాచేయటం. ఇది అయన జీవితంలో నెరవేరలేదు. తాతయ్య దానికోసమే తన ప్రాణాలు ఇచ్చాడు. వారిచావుకు ప్రపంచమంతా ఏడ్చింది.

ఇక ఈ ప్రపంచంలో శాంతి నెలకొల్పే బాధ్యత అంతా మనమీదా ఇతర ప్రపంచంమీదా ఉంది. ప్రపంచం వారిమాటలకు ఎంత విలువ ఇచ్చిందీ నోటి మాటలలో కాదు; చేతలలో తెలియజేయాలి. తాతయ్యసిద్ధాంతాలు ప్రపంచం ఎంత వరకు అనుసరిస్తుందో చూద్దాం. వాళ్లు అనుసరించకపోతే మీరు పెద్దవారైనాక తప్పకుండా అనుసరించాలి.

# గాంధీజీ

కృష్ణశాస్త్రి

మన హిమాలయాలు మన గంగలు పొలాలు
మన స్థలాలు పూల వనులు గనులు
మన అఖండభూతి మనజాతి మననీతి
ఉన్నవరకు గాంధి ఉండితీరు.

మొదట శిరమునెత్తి పిదప ఛాతీ విప్పి
కంట వెలుగునిలిపి కంఠమెత్తి
మానవుండనంగ మా గాంధియే యంచు
గర్వపడుచు చాటగలను నేను.

నా శిరస్సు శీతనగమంత ఎగద్రోసి
నా నరాల జీవనదులు పోసి
నన్ను మానవునిగ నన్ను భారతునిగా
సలిపినాడు, పరువు నిలిపినాడు.

బొరియలోని పురుగు నరునిగా నొనరిచి,
నరుని నన్ను వీరవరునిజేసి,
దేశ దేశ సభల తెగువతో తేజుతో
నిలిపినాడు, వెరగు గొలిపినాడు.

ఒక్క గుండెనేని ఉన్నదా ఆనంద
లేశమేని గాంధి ఆశ విడడు;
ఒక్క గుండెయేని పొక్కినా వేదన
స్వాంతమందు గాంధి శాంతి పడడు.

సగము బట్టలేని సామాన్యుడు ఫకీరు
తాతయొకడు లోక తాతయయ్యె;
ఏ మహత్తు లోన ఇమిడించు కొన్నాడొ
ఈ యుగాన, చిత్ర, మీ జగాన!

ప్రాత ఘనతమీదపడి జీవితమ్ముల
నిడ్చియేమి? అశ్రు లొడ్చియేమి?
కదలి చన్నగాంధి గట్టి పునాదిగా
క్రొత్తజాతి కట్టికొందు నింక.

ఒకని కులము, మతము నొక్కని, నొక్కని
స్వార్థ, మొకని లోభ మావహింప,
తెరలు పొరలుగాగ తీయని చల్లని
నేల నేల బూదిపాలు చేయ?

ద్వేష మున్నచోట దేవుండు వెలయడు;
మతులు గతులు దప్ప మతములేదు;
ఒక్క కంటప్రేమ ఒక కంట సత్యమ్ము
వెలుగ, జగతి శాంతి నిలిపికొందు.

ఏను నా మహాత్ము నెంతేని పూజింతు,
అతని పెక్కుగతుల ననుసరింతు,
కాని అతనికన్న ఘనమైన సత్యమ్ము
తలపు పలుకు పనుల నిలిపియుంతు.

ఎల్ల ఎల్లలు కరగగా, ఎల్ల కల్ల
లల్ల నల్లన సురుగగా, ఎల్లజనులు
చల్లని కుటుంబమయి మనజాలు వరకు
మా మహాత్ముడు మా గాంధి మనియెతీరు.

# మహాత్ముని నీతివాక్యాలు



ఎలాగైతే కుండలు వేరయినా మట్టి ఒకటేనో,



నగలు వేరయినా బంగారం ఒకటేనో,



ఆవులు వేరయినా పాలు ఒకటేనో,



అలాగే మతాలు వేరయినా మనుషుల్లోఉండే పరమాత్మ ఒకటేను.



## మన గాంధితాత

ప్రొద్దున్నే 5 గంటలకు నిద్రలేచేవాడు.

5-15 కు ముఖంకడుక్కునేవాడు.

5-30 కు ప్రార్ధన చేసేవాడు.

6-30 కు భోంచేసేవాడు.

7-30 నించి షికారుకు పోయేవాడు.

8-30 కు ఇంటికివచ్చి నూనె వొంటికి రుద్దించి స్నానంచేసేవాడు.

11- కు మధ్యాన్న భోజనం

ఒంటిగంటనించి పనులు చూసుకుని కాసేపు నిద్రపోయేవాడు.

4-30 నించి 6 వరకు నూలువడికేవాడు.

సాయంత్రం 6 కు భోంచేసి పత్రిక చదివేవాడు.

7 కు సాయంకాల ప్రార్ధన చేసేవాడు.

7-15 నించి షికారు వెళ్లేవాడు.

9 నించి ఏవైనా పనులుచూసుకునేవాడు.

10 గంటలకు నిద్రపోయేవాడు.



# మన గాంధితాత

మాయమైపోయినాడు మన గాంధితాత,
మాకింక కనరాడు మన గాంధితాత.
మేఘాల తెరలలో దాగినాడేమొ
మాకుచూపింతువా? ఓ చందమామ!
చుక్కలా గుంపులో నక్కినాడేమొ
దారి చూపింతురా? ఓ అక్కలార!
స్వాతంత్ర్య సంపద మా కందజేసి,
మాయమైపోయినాడు మన గాంధితాత,
మా కింక కనరాడు మన గాంధితాత.

బానిసత్వము రూపు మాప నిందాక
చెరసాలలో బడి చిక్కు లెన్నెన్నొ
అనుభవించిన తాత చనిపోయినాడు,
మనతాత కనుపింప మనకనుల విందు
మహియెల్ల నిండారు సంతసముబొందు,
మాయమైపోయినాడు మన గాంధితాత,
మనకింక కనరాడు మన గాంధితాత.

అవివేకి మూర్ఖుడౌ ఒక రాక్షసుండు
గురిచూచి కాల్చిన గుండుపైదాకి
నేలపైగూలెను నిముసంబులోన
తండ్రి చంపినవాడు ధాత్రికీచేటు
గురువు చంపినవాడు ధరణికే కీడు,
మాయమైపోయినాడు మన గాంధితాత,
మన కింక కనరాడు మన గాంధితాత.

రచన: కవిచంద్రులు

# గేయకథలు

ఏటుకూరి

## పిట్టకథ



చిటారు కొమ్మల సందుల్లో
మిఠాయి పొట్లము మోస్తరుగా
తీతువు గూటిని గట్టిందీ
తెల్లటి గ్రుడ్లను బెట్టింది.

బూడిద ఱెక్కలు గప్పిందీ
పొదుగుడు ప్రారంభించింది
పున్నమ చొరబడ కుండగనే
బోలెడు పిల్లల జేసింది.

మగపిట్టొకనా డెందులకో
మధ్యరాత్రి కిలు చేరింది
వచ్చిన భర్తను చూచిందీ
వలవల పెండ్లా మేడ్చింది.

ఏమని మగపిట్టడిగింది
ఏడ్చుచు నాడుది యిట్లంది:
"మిన్ను విరిగి పైబడితే నా
కన్న బిడ్డ లేమౌతారో?



ఏ దేవుని పుణ్యమ్మననో
ఇంతవఱకు పడ కాగింది
మింటివైపు చూస్తుంటే నా
కంటికి కూరుకు పట్టిందా?"

మగపిట్ట:

"ఈ భాగ్యమ్మన కేనంటే?
ఏడుస్తూ గూర్చున్నావూ?
కాళ్లు మింటివంకకు చాపి
కన్ను గూరకక పోయావా?

మఱచి తప్పి పైబడితే నా
మద మణగింపక పోయానా?"
అంటూ తనకాళ్లటు చాపి
ఆలిని నిద్దుర పుచ్చింది.

బల్లున తెల్లా వారిందీ
పక్షులు నిద్దుర లేచినవి
పడితే చెడుతుం దనుకొంటూ
పకపక నవ్వు కొన్నావి.

తెలిసీ తెలియని మిణుకులతో - దిగులు జెందుతా రాడంగుల్
ధైర్యము చెప్పే వారుంటే - తబ్బిబ్బులు పడకుంటారు.






## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

ఇక్కడ తొమ్మిదీ డేరాలు వున్నై. తొమ్మిదీ ఒకే మోస్తరుగా వున్నట్టు కనిపిస్తున్నయ్యి కదూ? కాని అన్నిడేరాలూ ఒకే మోస్తరువి కావు. తొమ్మిదింటిలో రెండు డేరాలు మాత్రమే ఒక రకంగావున్నై. ఆ రెండు డేరాలూ ఏవో కనుక్కోండిచూదాం! మీరు కనుక్కోలేకపోతే, జవాబు వేరొక పేజీలో చూడండి.

# అడవిలో తోలుబొమ్మలాట

అనగా అనగా ఒకఊళ్ళో తోలుబొమ్మలాట రంగోజీ ఉండేవాడు. అతని మేళము చాలా పెద్దది. చక్కగా పాడేవారు. వారి బొమ్మలాట చాలా అందంగా ఉండేది.

ఒకప్పుడు యీ రంగోజీ మేళమువారు నాటకాలకొఱకు దూరప్రాంతము వెడుతున్నారు. మార్గసౌకర్యాలు లేనిరోజులవి. చాలాసేపు ప్రయాణముచేసిన తరువాత వారికి ఒక అడవి అడ్డువచ్చింది. ఆ అడవి చాలా భయంకరముగా ఉంది. దానిగుండా అల్లాగే శ్రమపడుతూ ప్రయాణము చెయ్యగా చెయ్యగా కొంతసేపటికి ప్రొద్దు గూకింది. కనుచూపుమేరలో ఒక చిన్నపల్లె ఉన్నట్టుగా వారికి కనబడింది. అక్కడకుపోయి ఆ రాత్రికి కాలము గడుపుదామని అనుకున్నారు.

అది చిన్నచిన్న పూరిగుడెసెలతో కూడుకున్న ఊరు. ఆ గ్రామమును అనుకొని చిన్న చెఱువు ఉంది. చెఱువుగట్టున మన రంగోజీ మేళమువారు విడిది దిగినట్టుగా బసచేసారు. వారి గుఱ్ఱాలకు, గాడిదలకు మంచినీరుపెట్టి, ప్రొద్దున్న వండుకున్న నిలవబాపతు అన్నముతిని, మంచినీళ్ళు త్రాగి, పొగపీల్చుకుంటూ, అడ - మగ, పిల్లా - మేక విశ్రాంతి తీసుకుంటున్నారు. గుఱ్ఱాలు, గాడిదలు అక్కడున్న పచ్చిక ఆనందముగా మేస్తున్నాయి.

అంతలో ఆ గ్రామస్థులలోని నలుగురు పెద్దలువచ్చి "మా వూళ్లో మకామువేశారు గనుక ఈ రాత్రి యిక్కడ ఒక ఆట ఆడండి. ప్రొద్దున్నే మీకు సంభావనయిచ్చి పంపిస్తాము. కాని మావద్ద దీపాలకు చమురుకూడా లేదు. తెఱకు గుడ్డలుకూడా దొరకడము కష్టమే! అన్నీ మీదగ్గరవే ఉపయోగించి ఆటఆడి మమ్మలిని ఆనందపర్చండి." అని బలవంతంచేశారు.

గెద్దాడ సత్యనారాయణ, వెలివెల అగ్రహారం.



వారిమాటలు త్రోసిపారవేస్తే అనట్టడవిలో యేమిప్రమాదము వస్తుందో అని, ప్రయాణబడలిక అయినా లెక్క చేయకుండా, చిట్టచివరకు ఒప్పుకున్నారు.

అక్కడిమనుష్యులు - వారిమాటల ధోరణి చిత్రముగా తోస్తున్నాయి. అడవి మనుష్యులు యింతే కాబోలు అని వారు అనుకున్నారు. కొంత సేపటికి చాలా ప్రయాసమీద మేళంవారు గ్రామస్థులు కలిసి పందిరి తయారుచేసారు. మేళం వారి తాలూకు ఆడవాళ్ళ ఉతికిన చీరలు పందిరికి బిగించి, అప్పుడప్పుడు మిగుల్చుకున్న నిలువబాపతు ఆముదముతో విధిలేక దీపాలు వెలిగించి, చాలా ప్రొద్దుపోయినతరువాత రామాయణములోని సుందరాకాండ ప్రారంభం చేసారు.

గ్రామప్రజలు అక్కడకుచేరి. బొమ్మల గంతులు - వారిపాటలు - తాళపుచప్పుళ్లు- మృదంగము మోతలు విని, ఒకరివైపు ఒకరు చూచుకుంటూ లొట్టలు వేసుకుంటున్నారు.

కొంతసేపటికి అమాంతంగా ఆంజనేయులవారి బొమ్మ తెరమీదకు వచ్చింది. ఆబొమ్మ ఎప్పుడైతే తెరమీద కొచ్చిందో, ఎక్కడ ప్రజలక్కడ మాయమయ్యారు. ఆ ఊరు యేమయిపోయిందో అరలేదు.

ఆంజనేయులవారిని ఆత్మలో అనుకున్నంతమాత్రాన దెయ్యాలు, భూతాలు కనీసం ఆ రామడలయినా వెళ్లిపోతాయి. ఇక హనుమంతుడిని చూడడమే సంభవిస్తే కాలికొద్ది వెనుకకు తిరిగి చూడకుండా పరుగెడుతాయి. అంత భయం వాటికున్నప్పటికీ పూర్వము అవి మనుష్యు



లను అనేకవిధాల తిప్పలుబెట్టేవి. అంజ
నేయుని స్మరించి, పూజించి మన
పూర్వులు యీ బాధనుండి తప్పించు
కొనేవారు..

మన రంగోజీమేళంవారికి ఈదెయ్యాలు
పారిపోయిన సంగతి తెలియదు. వాళ్లు
అలానే ఆడుతూ ఉన్నారు.

కొంతసేపటికి మేళగాళ్ళలో ఒక
యువకుడు 'మంచినీళ్ళండీ, బాబయ్యా!'
అంటూ బయటికివచ్చాడు. ఎవరూలేరు.
గ్రామమూ కనిపించదు. అతనికి కంగారు
పుట్టి చఖ్ఖున లోపలికిపోయి మేళతాళాలు
ఆపుజేయించి తనుచూచి వచ్చినదంతా
గాభరాపడుతూ చెప్పాడు. అందరు
ఒకేసారి ఆశ్చర్యపోయి బయటికి వచ్చి
చూస్తే - భయముకూడా వేసింది.

'ఇదంతా దెయ్యాలమాయ. మన అంజ
నేయులుగారు తెఱమీదకు రావడంతోనే
వీళ్లంతా పారిపోయారు.' అని వాళ్లంతా
నిర్ధారణచేసుకుని, 'మిగిలిన రాత్రికూడా
యీ విగ్రహాన్ని ఆడించుకొంటూ
ఉందాము. మరే దెయ్యముకూడా యిక్క




డకు చేరదు' అని చెప్పుకుంటూ ధైర్యము
తెచ్చుకొని, 'వీరహనుమాన్' అంటూ తెల్ల
వార్లూ చేతిచమురు భాగవతము ఆడుతూ
కాలము గడిపారు.

ఇంతలో తెల్లవారింది. "అమ్మయ్యా
బ్రతికిపోయాం. ఈ విగ్రహమే లేకపోతే
మనపని యేమయ్యేదో! మారుతిపుణ్యామా
అంటూ మన ప్రాణాలు మనకు దక్కా
నాయి" అని చెప్పుకుంటూ, సామానులు
గుఱ్ఱాలకు, గాడిదలకు యెక్కించి 'బ్రతుకు
జీవుడా'అంటూ బయలుదేరి వెళ్లిపోయారు.



# వీరలక్ష్మి పెద్దక్కయ్య



అనగనగా ఒక పల్లెటూరిలో నలుగురు అక్కచెల్లెళ్లు వుండేవాళ్లు. వారికి తల్లి తండ్రి లేనందువలన అందరిలోనూ కడసారి పిల్ల అయిన వీరలక్ష్మిని ముగ్గురు అక్కలూ అతి గారాబంగా చూసేవారు. వారితోపాటు వారిభర్తలుగూడా వీరలక్ష్మిని ఎంతో ముద్దుగా చూసేవారు. పెద్ద అక్కగారూ పెద్ద బావగారూ వీరలక్ష్మికి పెళ్లిచేశారు.

కాని అత్తవారిది దూరదేశం అవటం వల్లనో మరి, ఏ ఇబ్బందులవల్లనో పిల్లని అత్తవారింటికి పంపించమని వాళ్లు కబురూ చెయ్యలేదు, తాము రానూ రాలేదు.

దసరా వొచ్చింది, అట్లతద్దీ వొచ్చింది. ఆ వూళ్లో ఆడపిల్లలందరినీ, వారి వారి అత్తవారు తమ ఇళ్లకు తీసుకుపోయినారు. కాని వీరలక్ష్మి కోసం ఎవరూ రాలేదు.

ఒకనాడు చెరువుగట్టున ఆడవాళ్లందరూ నీళ్లకి చేరినప్పుడు వీరలక్ష్మి అక్కల్ని అమ్మలక్కలందరూ, ఇంక పట్టలేక అడిగేశారు - వీరలక్ష్మి అత్తవారు పిల్లని తీసికెళ్లడానికి రాలేదేమని. పాపం వీరలక్ష్మికి ఎంతో చిన్నతనమనిపించి తల వొంచేసుకుంది సిగ్గుతో.

ఆమె అక్కలు మాత్రం లోపల సిగ్గుతో కుంగిపోతున్నా పయికి, "మా వెంకయ్య మరిదిగారు సాధారణమయిన వాడనుకున్నారేమి? అతనికి లెక్కలేనన్ని వ్యవహారాలు. వూరికంతా పెద్ద. ఆయన అందరికీ సలహాలియ్యడంతోనే సరిపోతుంది. ఇటు పొలంకోతలే చూసుకుంటాడా, ఇక పెళ్లాన్నే తెచ్చుకుంటాడా! తీరిక ఎక్కడ వుంది ఆయనకి." అని బాగా కోతలు కోశారు.





ఆ సమయాన్నే చెరువుగట్టున వున్న దుబ్బుల వెనకాల ఈరాత్రికి ఎవరింటికి కన్నంవేద్దామా అని ఆలోచిస్తో పొంచివున్న ఒక గజదొంగ ఈ మాటలన్నీ విన్నాడు. బంగారం బొమ్మలాగ అందాలు వొలికి పోతున్న వీరలక్ష్మినీ, వొంటినిండా ధగ ధగ మెరుస్తున్న బంగారం నగలనీ చూసేటప్పటికి, దొంగకి, ఎట్లాగయినా ఆ అమ్మాయినీ, ఆ అమ్మాయితోపాటు ఆ నగలనీ కాజేయాలని ఆశపుట్టింది.

మర్నాడు సాయింత్రం, కొత్తబట్టలు వేసుకుని బాగా ముస్తాబయి, పువ్వులూ, మిఠాయి తీసుకుని ఆ గజదొంగ, దర్జాగా వీరలక్ష్మి యింటికి వచ్చాడు.

"నేను వీరలక్ష్మి మొగుడు వెంకయ్యని. నన్ను మర్చిపోయారా? నేను వీరలక్ష్మిని తీసుకెళ్లడానికి వచ్చాను. వదినెగారూ, ఆలశ్యంచేసినందుకు ఏమీ అనుకోవద్దు. తొందర పనులవలన ఏమాత్రం వీలులేక, ఇంక ఉపేక్షచేస్తే, ఎప్పుడూ ఇట్లాగే అవుతున్నదని, చివరికి ఎట్లానో ఓలాగ తీరిక చేసుకుని వొచ్చాను" అని ఎంతోవినయంగా చెప్పాడు.

ఎప్పుడో పెళ్లిలో ఒకసారి చూడడంవల్ల వీరలక్ష్మి మొగుడు ఎట్లావుంటాడో ఎవరికి గుర్తులేదుగనక, పాపం అందరూవాణ్ణినమ్మి, నిజంగా వెంకయ్యగారు రాకరాక, ఆఖరికి వీరలక్ష్మిని తీసుకెళ్లడానికి వొచ్చారని ఎంతో సంతోషించి చాల మర్యాదలుచేశారు.

కాని వీరలక్ష్మికి మాత్రం అనుమానంగా వుంది. ఆమెకి తనమొగుడు చాల అందగాడనీ తెలివయినవాడనీ జ్ఞాపకం. అది చూసుకుని గర్వంకూడాను. "వీణ్ణి చూడబోతే మొద్దులాగా, తెలివి లేనివాడిలా కనపడుతున్నాడు. ఏమిటా?" అనుకుంది.





ఇంక పట్టలేక తన అనుమానం అక్కలికి తెలియపరిచింది.

వీరలక్ష్మికి తన మొగుడు గుర్తువున్నంత, తన అక్కలికి ఎక్కడుంటుంది మరి? అదీగాక మొగుడంటూ ఒకడువొచ్చి తీసుకుపోతున్నాడు. అందరిలో మళ్లీ తలెత్తుకు తిరగవచ్చుననే సంతోషంలో వారిక వొళ్లు మర్చిపోయినారు.

అక్కలందరూ కలిసి వీరలక్ష్మిని పరియాచకాలాడారు. వుడికించారు. ఇంక మరీ మొండిపట్టుపడితే చివాట్లు పెట్టారు. ఇంక ఏమీ అనలేక, ఏమయితే అది అవుతుందని గుండె నిబ్బరం చేసుకుంది వీరలక్ష్మి.

మర్నాడు వీరలక్ష్మిని ఆ గజదొంగతో ప్రయాణంకట్టి పంపారు ఆమె అక్కలు.

గజదొంగ వీరలక్ష్మిని అడ్డదోవలన్నీ తిప్పి, గట్లమీదనించి, కంచెల్లోంచి, డొంకల్లోంచి, తీసుకుపోతున్నాడు. లోపల చచ్చేటంత భయంతో బెదిరిపోతున్నా, చాల తెలివయినదీ ధైర్యసాహసాలు గలదీ గనుక వీరలక్ష్మి, పైకి తొణకకండా అతనివెంట నడిచింది.

పోగా పోగా మిట్టమధ్యాన్నానికి దొంగల గూడేనికి చేరుకున్నారు. ఆ గూడెమంతా కలిసి ఆరు గుడిశెలున్నాయి. అన్నిటికన్న పెద్దగుడిశె దగ్గిరికివెళ్లి ఆ గజదొంగ, "అమ్మా, కొత్తకోడలూ, నేనూ వొచ్చాం, తలుపుతియ్యవే" అని తలుపు కొట్టాడు.

లోపలినించి వాడి ముసలితల్లి తలుపు తీసి బంగారం బొమ్మలాగ మెరిసిపోతూన్న వీరలక్ష్మిని చూసి ఆశ్చర్యపడింది. చాల సంతోషంతో ఇద్దరినీ లోపలికి తీసుకుపోయింది. పైకి చూడపోతే ఉత్త పూరి గుడిశేకాని, లోపలమాత్రం దబ్బెంమీద



పట్టుచీరలూ, ఇంటినిండా దొల్లుతో వెండి సామానూ. ఇదంతా చూసేసరికి వీరలక్ష్మికి అంతా బోధపడింది. 'అరే, గజవెంగల ముఠాలో పడ్డాను! వీళ్ళనించి ఎట్లా తప్పించుకోడమా?' అని ఆలోచించి ఒక ఉపాయం పన్నింది.

వీరలక్ష్మి అత్తతో "అత్తయ్యా! నేను అట్లతద్దినోము తీర్చుకోలేదు అది తీర్చుకొంది భర్తతో కాపరం వెయ్యటం మాకు ఆచారంకాదు" అన్నది.

అప్పుడు దొంగ వెంకయ్య తల్లితో "అమ్మా, కొత్త కోడలిచాత అట్లతద్దినోము పట్టించవే. నోముకి ఏంకావాలో కనుక్కో. నేను బజారికెళ్లి తెస్తాను" అన్నాడు.

అప్పుడు వీరలక్ష్మి ఇవన్నీ కావాలంది. "చాటలు, గీటలు; లక్కజోళ్లు, గిక్కజోళ్లు; చీరలు, గీరలు; రవికలు, గివికలు; పళ్లు, గిళ్లు; కొబ్బరికాయ, గిబ్బరికాయ; పసుపు, గిసుపు; కుంకుం, గింకుం; కాటిక్కాయ, గీటిక్కాయ; ఆకులు, గీకులు; వక్కలు, గిక్కలు;"

ఇవన్నీ పాపం పుస్తకంలో రాసుకుని బజారుకు బయల్దేరాడు దొంగ వెంకయ్య.

కొడుకు వెళ్ళటంచూసి, ఆ ముసలమ్మ "ఆ గూట్లో ఈర్పేను తీసుకొచ్చి, కొంచెం



పేలుచూస్తావా అమ్మాయి" అని అడిగింది వీరలక్ష్మిని. వీరలక్ష్మి ఆ ముసలమ్మ ముడివిప్పి, జుట్టు ముందరికి పడేసి, పేలుచూచినట్టే చూసి గోడకి తగిలించిన కత్తితీసి ఒక్కదెబ్బన ఆ ముసలిదాని తల నరికేసింది. మొండెన్ని గోడకి ఆనించి కూచోపెట్టి రాట్నం ముందర పెట్టింది. పొయ్యిరాజేసి, పొయ్యిమీద బాణలిపెట్టి బాణలిలో చమురుపోసి, ముసలిదాని తలని సరిగ్గా, కారుతున్న నెత్తురు, కాగుతున్న నూనెలో పడేట్టుగా పయిన దూలానికి వేళాడకట్టింది.

(ఇంకావుంది.)



## రెంటికీ ఒకటేతల



ఈ బొమ్మ చూశారా? ఎంత గమ్మత్తుగావుందో. తల ఒకటిగావున్నా రెండుఎలుకలు ఉన్నై. ఒక ఎలుక మెడ వెనక్కితిప్పి చూస్తూవుంటుంది. ఇంకొకటి మామూలుగా కూచుని చూస్తూవుంటుంది.



పై చదరంమధ్యని ఒక పుస్తకంవుంది. చదరం నాలుగుమూలలా నలుగురు పిల్లలు వున్నారు. ఆ నలుగుర్లో ఎవరో ఒకళ్లే ఆ పుస్తకం తెచ్చుకోగలరు. ఆ పిల్లవాడెవరో కనుక్కోండి.

## ముగ్గు



జె. పార్వతీబాయి, నూజవీడు.

## పజిలుకు జవాబు

| [1] స | భ | ■ | [2] ప్రే | ■ | [3] మా | [4] త |
|---|---|---|---|---|---|---|
| ర | ■ | [5] చీ | రా | [6] ల | ■ | ప్పు |
| [7] దా | [8] వా | ■ | [9] స | తి | ■ | లు |
| ■ | [10] లి | [11] పి | ■ | [12] క | [13] థ | ■ |
| [14] అ | ■ | [15] క | [16] పి | ■ | [17] ర | [18] వి |
| శ్వే | ■ | [19] ము | ద | ము | ■ | య్య |
| [20] ము | క్కు | ■ | ప | ■ | [21] పా | ము |




అనంగనంగా ఒక చిన్నవూరు. ఆ వూళ్లో ఒక బీదఅమె. ఆమెకి ఒక కొడుకు. కొడుకుపుట్టిన కొద్దిరోజులకే భర్త చనిపోయాడు. భర్త చనిపోయినతర్వాత కొంత కాలంవరకూ ఆమె తనదగ్గిరవున్న డబ్బు ఖర్చుపెడుతూ సంసారం సాగిస్తూవుంది. కాని సంపాదన లేకుండా, వున్నది తింటూ కూచుంటే ఎంతకాలం గడుస్తుందీ. విధవరాలి దగ్గిరవున్న డబ్బు అయిపోవచ్చింది. పోనీ కొడుకు ఏదైనా ఉద్యోగంచేసి సంపాయిస్తాడా అంటే ఆ ఆశ లేనేలేదు. వాడికి పొట్టపొడిచినా అక్షరంముక్క లేదు. కాని ముప్పొద్దులూ తిండిమాత్రం గొంతుదాకా మెక్కేవాడు. మనవాడికి ప్రపంచజ్ఞానం కూడా శూన్యం. ఎందుకూ కొరగాని కొడుకును కూర్చోపెట్టి పాప మాయిల్లాలు ఒక్కతే కష్టపడి ఎంతకాలమని మేపగలదు చెప్పండి!

చివరికి ఒకరోజున ఆమె కొడుకుని పిల్చి "నాయనా, నీ తండ్రి చనిపోతూ మనకు మిగిల్చిన డబ్బుతో యింతకాలం మనం తింటూవస్తున్నాం. ఆ డబ్బుకూడా అయిపోవచ్చింది. ఇక నువ్వేదైనా ఉద్యోగం చేసి నాలుగు డబ్బులు సంపాయించుకొస్తేనేగాని మనకి గడవదు. నా ఒక్కదానిపొట్ట అయితే ఏదోవిధంగా రెక్కలు విరుచుకుని నింపుకుంటాను. కాని యిక నిన్నుకూడా పోషించటం నావల్లకాదు. ఎక్కడైనా ఉద్యోగంచూసుకుని నీపొట్ట నీవు పోసుకోవాల్సిందే" అని చెప్పింది.

తల్లి యిలా చెప్పేసరికి మన శుంఠ సుబ్బన్నకి చాల విచారంకలిగింది. ఏమనుకున్నాడో ఏమో, "అమ్మా, అమ్మా! ఒక పని చేద్దాం. యిప్పుడు మనదగ్గిరవున్న డబ్బుపెట్టి ఒక గేదెని కొందాం. నేను రోజూ దాన్ని బాగా మేపుకొస్తాను. అది



యిచ్చిన పాలు అవీ అమ్ముకుంటూ బ్రదుకుదాం" అన్నాడు. తల్లికికూడా ఈ ఆలోచన నచ్చింది. సరేనని మర్నాడే ఒక గేదెని కొన్నది. రోజూ మన శుంఠసుబ్బన్న గేదెని బైట బీళ్లల్లో మేపుకొస్తుండేవాడు. పాలు, పెరుగు అమ్మి వచ్చిన డబ్బుతో తల్లి సంసారం మళ్లీ ఎలాగో నెట్టుకొస్తోంది.

ఇలా కొన్నిరోజులు గడిచినై. ఒకరోజున సుబ్బన్న గేదెని మేపుతూవుండగా దగ్గర్లో తొండ ఒకటి పోతూ కనిపించింది.

సుబ్బన్న తొండతో—"తొండయ్యశాస్త్రీ, తొండయ్యశాస్త్రీ! ఉద్యోగానికిపోతున్నావా?" అని అడిగాడు.



"అవునన్నట్టు తలాడించింది" తొండ.

"నాకుకూడా ఏదైనా ఉద్యోగం చెయ్యాలని వుంది. నేనుకూడా నీతో రానా?" అని అడిగాడు సుబ్బన్న.

"అలాగే" అన్నట్లు తొండ తల ఆడించింది.

సరేనని ముందు తొండ దానివెనకనే సుబ్బన్న బయలుదేరిపోతున్నారు. కొంత దూరం పోయేసరికి తొండ ఆగింది. అక్కడ ఒక చెట్టుకింద ఒక పుట్టవుంది. తొండ త్వర త్వరగా ఆ పుట్టలోకి పోయింది. సుబ్బన్న 'తొండయ్యశాస్త్రి తిరిగి వస్తాడు' గదా అని పుట్టదగ్గిర చతికిలబడ్డాడు. గంటలు గడిచిపోతున్నై కాని తొండయ్యశాస్త్రి బయటికి తిరిగి రాలేదు. చీకటికూడా పడుతోంది. సుబ్బన్నకి ఏం చెయ్యాలో తోచలేదు. పుట్టకన్నంలోకి తొంగిచూచాడు. అక్కడ ఒక రత్నాలేనా, మొహరీలేనా, కాసులేనా ఎంతో ధనం కనిపించింది. అది చూసేసరికి సుబ్బన్నకి చాలా ఆశ్చర్యం వేసింది - "తొండయ్యశాస్త్రి, మొత్తానికి అసాధ్యుడులాగానే వున్నాడే! ఎంతపెద్ద వుద్యోగం చేస్తూండకపోతే యింత ధనం



సంపాయిస్తాడు. అతన్ని అడిగితే నాకూ ఏదైనా ఉద్యోగం తప్పక యిప్పిస్తాడు. ఇవాల్టికి యిక యింటికివెళ్లి రేపు మళ్లీ వచ్చి అడుగుతాను" అనుకుని సుబ్బన్న చీకటి పడుతుండగా గేదెని తోలుకుని యింటికి తిరిగివచ్చాడు. ఇంత ఆలస్యం కావటానికి కారణమేమిటని తల్లి అడిగింది. జరిగిందంతా సుబ్బన్న తల్లితో చెప్పాడు. అది వినేసరికి ఆమెకి ఆ ధనం ఎలాగైనా తెచ్చుకోవాలనిపించింది.

మర్నాడు తల్లీ కొడుకు లిద్దరూ తొండయ్యశాస్త్రివున్న పుట్టదగ్గిరికి వెళ్లారు. తల్లి కన్నంలోకి తొంగిచూసింది. ధనం రాసులుపోసివుంది. ఆ ధనం అంతా గబ గబ చీరెచెంగులో పోసుకుని కొడుకుతో యింటికి తిరిగొచ్చింది.

తొండయ్యశాస్త్రి ఈసంగతి కనుక్కుంటే తన కెక్కడ ఉద్యోగం యిప్పించకపోతాడో నని సుబ్బన్నకి దిగులేసింది. ఆ ధనం మళ్లీ తొండయ్యశాస్త్రి పుట్టలో పెట్టేసి రమ్మని తల్లితోచెప్పాడు. కాని తల్లి విన లేదు. సుబ్బన్న ఎంతో బ్రతిమాలాడు. కాని తల్లి ఒప్పుకోలేదు. చివరికి, "పోలీసులతో చెప్పి నిన్ను దొంగవని పట్టిస్తాను"



అని కూడా బెదిరించాడు. అప్పటికీ తల్లి వినలేదు. కాని ఈ గడుగ్గాయి నిజానికి అంతపని చేస్తాడేమోనని అలాంటిదేదైనా జరిగితే ఎలా తప్పించుకోవటమా అని ఆమె ఆలోచించింది. అలా ఆలోచించగా ఆమెకి ఒక చక్కటి ఆలోచన తట్టింది.

"ఒరే సుబ్బులూ, సుబ్బులూ! ఇవాళ సాయంత్రం మనవూళ్లో అరిసెలవాన కురుస్తుందని వూరంతా చెప్పుకుంటున్నారు. నీకూ అరిసెలంటే ఎంతో యిష్టంగదా. నిన్ను మనయింటి కప్పుమీదకి ఎక్కిస్తాను. అరిసెలవాన వచ్చినప్పుడు నీ కడుపు పట్టి

నన్ని అరిశెలు తినొచ్చు" అన్నది. నిజమే గదా అనుకున్నాడు మన శుంఠసుబ్బన్న. ఒక నిచ్చెనవేసుకుని యింటికప్పు ఎక్కి కూచున్నాడు. ఇదేసందుగదా అని తల్లి తను తెచ్చిన ధనం అంతా నేలలో లోతుగా ఒక గొయ్యి తొవ్వి, దాంట్లో పూడ్చిపెట్టింది. తర్వాత ఒక బుట్టెడు అరిశెలు వండింది.

సాయంకాలం అయింది. సుబ్బన్న అరిశెలవాన ఎప్పుడు కురుస్తుందా అని కాచుకుని కూచునివున్నాడు యింటికప్పు మీద. తల్లి అరిశెలన్నీ చిన్నచిన్న ముక్కలు చేసి సుబ్బన్నమీద పడేట్టుగా వేసింది. పడ్డ ముక్కలు పడ్డట్టుగా రెండు చేతులా నోట్లో కుక్కుకుని తిన్నాడు సుబ్బన్న. అరిశెలన్నీ అయిపోయాయి. "ఇక దిగిరా, వాన వెలిసిపోయింది" అని కేకవేసింది తల్లి. సరేనని సుబ్బన్న దిగివచ్చాడు.

కొన్నిరోజులు గడిచినై. కాని సుబ్బన్నకి తల్లిచేసిన దొంగతనం మనస్సులో మెదుల్తూనేవుంది. తల్లితో చెప్పకుండా పోయి పోలీసులని పిలుచుకొచ్చాడు. పోలీసులు యిల్లంతా గాలించారు. కాని ఏమీ కనిపించ లేదు. "వీడు వట్టి అబద్ధాలరాయడు. వీడి మాటలు నమ్మి మీరు వచ్చారు? చాలు చాల్లే పదండి!" అన్నది తల్లి.

అప్పుడు పోలీసులు శుంఠ సుబ్బన్నని "ఏయ్ సుబ్బన్నా! మీఅమ్మ ఈ దొంగతనం ఎప్పుడు చేసింది?" అని, అడిగారు.

సుబ్బన్న కాసేపు ఆలోచించి, "సరిగ్గా అరిశెలవాన కురిసినరోజునే!" అన్నాడు.

ఇదివిని, "అరిశెలవానేమిటి నీ మొహం. చూస్తే వట్టి అబద్ధాలరాయడుగా వున్నావ్. అరిశెలవాన కురవటం ఎంత నిజమో, మీ అమ్మ దొంగతనం చేసివుండటం అంతే నిజం." అని పోలీసులు వెళ్ళిపోయారు.

"బ్రతుకు జీవుడా" అనుకుని ఆ యిల్లాలు ఆ ధనంతో పెద్ద యిల్లు కట్టుకుని సుఖంగా కాలంగడుపుతోంది.

కథ కంచికి మనమింటికి.





# తెనాలి రామలింగం

శ్రీ కృష్ణదేవరాయలు పరిపాలించే కాలంలో విజయనగర పట్టణంలో అక్కిసెట్టి అనే కోమటి ఉండేవాడు. అతడు రాజమార్గాన గుగ్గిళ్లు అమ్ముకొని జీవిస్తూ ఉండేవాడు.

అయితే అక్కిసెట్టికి పెద్ద ఆలోచనలుండేవి. రాజవీధివెంట మహాకవులందరూ రాయలవారి ఆస్థానానికి వెళ్లటం చూసి, తానుకూడా మహాకవిఅయి, ఖ్యాతి సంపాదించి ఆస్థానానికి వెళ్లాలని గొంతెమ్మ కోరికలు కోరేవాడు. తనకు కవిత్వం నేర్పమని కవులను పీడించేవాడు. కాని పొట్ట పొడిచినా అక్షరం లేనివాడికి కవిత్వం ఎవరు చెప్పగలరు? అందుచేత కవులెవ్వరూ అక్కిసెట్టికి సహాయపడలేక పోయారు.

ఒకనాడు అక్కిసెట్టి ఇట్లా కాదనుకొని, తనకేమైనా కవిత్వం నేర్పితే తెనాలిరామలింగమే నేర్పాలని నిశ్చయించుకున్నాడు. తెనాలిరామలింగం ఆ దారిన ఆస్థానానికి వెళ్లటంచూసి, అక్కిసెట్టి ఆయన కాళ్ల మీదపడి కవిత్వం నేర్పమని వేడుకున్నాడు.

“ఓయిసెట్టీ, నీకు కవిత్వం రావాలంటే ప్రకృతిని నిత్యమూ చూస్తూఉండు. ఆకాశమూ, నక్షత్రాలూ, చంద్రుడూ, చెట్లూ, చామలూ చూస్తూఉంటే కవిత్వం దానంతట అదే వస్తుంది” అనిచెప్పి రామలింగం ఆస్థానానికి వెళ్లిపోయినాడు. ఆనాటినుంచీ అక్కిసెట్టి ప్రకృతిని పరిశోధించటం మొదలుపెట్టి కవిత్వంకోసం ఎదురు చూడసాగాడు.

ఒకనాడు పగలల్లా రాజవీధిలో గుగ్గిళ్లు అమ్మినన్ని అమ్మి మిగతావి ఇంటికి పట్టుకొచ్చి అంగడిలోపెట్టి అరుబయట మంచం వేసుకుని, అక్కిసెట్టి దానిమీద వెల్లికిలా పడుకున్నాడు. అప్పుడే ఆకాశాన పున్నమ చంద్రుడు వెండికంచంలాగా కనిపించాడు. అక్కిసెట్టికి కవిత్వంవచ్చి,

“పున్నమవెన్నెల కాసెగా”

అన్నాడు ఆశ్చర్యంతో.

అబ్బరాజు భానుమూర్తి, నిడుబ్రోలు.



సెట్టికి చాలా ఆనందమయింది. వెంటనే పాండురంగస్వామి ఆలయానికి వెళ్లి, "స్వామీ, నాకు కవిత్వంవస్తే నీకు రోజూ గుగ్గిళ్లు నైవేద్యం పెడతాను" అని మ్రొక్కి, సెట్టిగారు ఆలయంనుంచి తిరిగి వస్తుండగా ఆలయంలో పొన్నచెట్టుమీది కోయిల ఒకటి కూసింది.

"పొన్నపై కోయిల కూసెగా"

అన్నాడు సెట్టి ఆనందంతో.

"ఇవాళలేచి ఎవరిదో మంచి మొహమే చూశాను. కవిత్వం వచ్చేస్తున్నది" అని అనుకున్నాడు సెట్టి. ఇంటికి తిరిగివచ్చి అమ్మగా మిగిలిన గుగ్గిళ్లు తిందామని అంగడిలోకివెళ్లి గుగ్గిళ్లు పైకితీసేసరికి అవి పాసిపోయి ఉన్నాయి.

"అంగట్లో గుగ్గిళ్ల పాసెగా"

అన్నాడు సెట్టి విచారంతో.

ఇంకొకపాదం చెప్పగలిగితే పద్యం పూర్తవుతుంది. కాని ఎంత తన్నుకున్నా ఆ పాదం కుదరలేదు. అందుచేత ఆ అర్ధరాత్రివేళ అక్కసెట్టి తెనాలిరామలింగం ఇంటికివెళ్లి ఆయనను పిలిచి, "అయ్యా, మూడు పాదాలు కవిత్వం చెప్పాను. నాలుగో పాదం తమరుపూర్తిచేయా"లన్నాడు. మిగతావి చదవమన్నాడు రామలింగం.

"పున్నమవెన్నెల కాసెగా
పొన్నపై కోయిల కూసెగా
అంగట్లో గుగ్గిళ్ల పాసెగా"

అని చదివాడు అక్కసెట్టి.

"అక్కసెట్టి ముండమోసెగా!"

అని రామలింగం పద్యం పూర్తిచేసి వెళ్లి పడుకున్నాడు.

ఆ నాటినుంచీ అక్కసెట్టి కవిత్వం గొడవ మానేసి, గుగ్గిళ్లమ్ముకుంటూ నిశ్చింతగా జీవనం చేయసాగాడు.

# సీతాఫలం-రామాఫలం

అబ్బాయిలూ, అమ్మాయిలూ! మీలో అందరికీ సీతాఫలం, రామాఫలం అంటే తెలుసా? యెప్పుడన్నా తిన్నారూ? అందరూ తినిఉండరనుకుంటాను. నిజమేనా? పై ఆకారంలో భేదంఉన్నా లోపల గింజలూ రుచీ సమానంగానే ఉంటాయి. పేర్లను బట్టిచూస్తే వీటి పుట్టుకలో ఏదో గమ్మత్తు ఉండితీరాలని మీలో తెలివైన వాళ్లబుద్ధికి తడుతుంది. నిజమే, ఆ గమ్మత్తేమిటో కాస్త జాగ్రత్తగా చదవండి తెలుస్తుంది.

శ్రీ రామచంద్రమూర్తి రావణాబ్రహ్మను చంపి, సీతాదేవిని తీసుకుని అయోధ్యకు వచ్చి, పట్టాభిషేకం చేసుకున్న సంగతి అందరికీ తెలిసిందేగా. ఆయన పట్టాభిషేక మౌతుంటే సామంతరాజులూ, బంధువులూ స్నేహితులూ, భక్తులూ మొదలయిన వారంతా తలా ఒక కానుక తీసుకు వచ్చారు. అందులో వానరరాజు సుగ్రీవుడూ, రాక్షసరాజు విభీషణుడూ, దేవతల రాజు ఇంద్రుడూకూడా బహుమతులు, అంటే శుభసమయంలో చదివించటానికి, ప్రపంచములో గొప్పవైన వజ్రాలు, మణులు, రత్నాలు ఆదిగాగల అపురూపపు వస్తువులు తీసుకువచ్చారు. ఇక సామంత రాజులు, రాజాధి రాజులూ ఏదో ఒక గొప్ప వస్తువు తీసుకువచ్చారు. ఇంకా భక్తులూ, జ్ఞానులూ అందరూ కానుకలు తెచ్చారు.

అందరిలోకీ పరమ భక్తుడైన ఆంజనేయస్వామి పట్టాభిషేకం మూడురోజులుండనగా మొదలుపెట్టాడు ఆలోచన, ఏమి కానుక సమర్పించుదామా అని. శ్రీ రామచంద్రమూర్తికి పరమ ప్రియమైనదీ, యెవ్వరూ తేనిదీ తీసుకురావాలని

డా॥ బి. సత్యనారాయణ, భీమడోలు.



అయన పూహ. ఏవస్తువును గురించి ఆలో చించినా యెవరో ఒకరు తెచ్చేసేవారు. ఆంజనేయస్వామికి ఏమీ పాలుపోలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు. రేపు ప్రొద్దున పట్టాభిషేకం - అట్టేసమయంలేదు. తెల్లారే లోపుగా అకానుకేదో నిర్ణయించి తీసుకు రావాలి. చప్పున యేదో జ్ఞాపకంవచ్చి లేచాడు హనుమాన్. తక్షణం రివ్వుమంటూ బ్రహ్మదేవుని దగ్గరకుపోయి వాలాడు. హనుమంతుడు తొందరగా వేళగాని వేళ రావడంచూచి అదరిపడ్డాడు బ్రహ్మ. ఏంకొంప మునిగింవో దేముడా అని. భయపడి, కుర్చీవేసి కూర్చోమన్నాడు.

ఊహూ, కూర్చోలేదు హనుమంతుడు. "చాలా తొందర పనిమీద వచ్చాను. రేపు శ్రీరామచంద్రమూర్తి పట్టాభిషేక మహోత్సవం. ఆయనకు కానుకగా సమర్పించటానికి సీతాదేవికి, శ్రీరామచంద్రమూర్తికి పరమ ప్రియమైనది సృష్టించియిస్తేగాని వీలులేదు. అంతవరకూ నిన్ను వదిలేది లేదు" అన్నాడు.

హనుమంతుడు అసాధ్యుడనీ, పట్టిన పట్టు విడిచేరకంగాదనీ, బ్రహ్మకి తెలుసు. అయినా అర్ధరాత్రివేళ యీకోతి పీడ యేమిటి అనుకున్నాడో ఏమో, బాగా ఆలోచించి అంతకుముందు సృష్టిలో లేనివి,



అతి మధురంగా ఉండేవీ, రెండు పళ్లు సృష్టించి వాటికి సీతాఫలము, రామాఫలము అని పేరుపెట్టి 'వీటినియివ్వరా నాయనా, మీ రామచంద్రుడు చాలా ఆనందిస్తాడు' అని యిచ్చాడు.

తక్షణం భూలోకానికి వచ్చాడు హనుమాన్.

పట్టాభిషేక సమయమయింది. హనుమాన్ ఎక్కడున్నాడా అని అయోధ్యంతా వెతికిస్తున్నాడు శ్రీరామచంద్రుడు. యేమైనా కోపమొచ్చి అలిగాడేమో అనుకున్నాడుతనలో. హనుమంతుడంటే పరమ ప్రేమ ఆయనకు.పట్టాభిషేకం జరుగుతున్న సంతోషమే లేదాయనముఖంలో.

ఇంతలో హనుమంతుడు వచ్చాడంటె వచ్చాడన్నారు అందరు. హనుమంతుడు సరాసరి శ్రీరామచంద్రుడి పాదాలవద్ద వాలి రెండు చేతులతో రెండు ఫలాలూ సీతారాముల పాదాలవద్ద ఉంచి సీతాఫలము, రామాఫలము అని నమస్కారంచేశాడు.

శ్రీరామచంద్రుడు హనుమంతుడ్ని కౌగలించుకుని మూడు "రోజులనుండి కనపడటంలేదు, ఎక్కడున్నావోయి హనుమాన్?" అని అడిగాడు. హనుమంతుడు జరిగినకథంతా చెప్పాడు.

శ్రీరామునితోకూడా సభంతా ఆశ్చర్యపోయారు, హనుమంతుని భక్తికీ, శక్తికీ. తరువాత ఆఫలాలు రెండూ విడదీసి పెద్దలందరికీ పంచిపెట్టారు ప్రసాదంలాగా. అవితిని వాటి మధురానికి అంతా ఆశ్చర్యపోయి, హనుమంతుడ్ని పొగడుతూ ఆ గింజల్ని జాగ్రత్తగా పాతిపెట్టి మొక్కలు మొలిపించి కాయలు కాయించి అందరికీ సీతారామ ప్రసాదంలాగా పంచిపెట్టారు. శ్రీరామచంద్రుడు సీతాదేవీ ఎంతో ఎక్కువగా సంతోషించారు, హనుమంతుని భక్తికీ ప్రతిభకీని. ఆ నాటినుంచీ యీ నాటివరకూ మనం తింటున్నాం యీ ఫలాలను. హనుమంతుడ్ని ఒక్కసారైనా తలుచుకోము అవి తింటున్నప్పుడు.

ఇకనుంచి అవి తింటున్నప్పుడు అవి సృష్టింపించి భూలోకానికి తెచ్చిఅందించిన హనుమంతుడ్ని తలుచుకుంటుండండి సుమా.



# మామిడిపండు పలుకులు

అనగా అనగా ఓ గ్రామంలో ఒకాయనకు నలుగురు కుమారులు ఒక కుమార్తె వుండేవారు. అన్నలు నలుగురికి పెళ్లిళ్లు అయి వేరువేరు వూళ్లలో పనులలో వుండేవారు. చెల్లెలి పేరు కల్యాణి. ఆమెకుగూడా వివాహమయింది. భర్తనే భగవంతునిగా తలుస్తూ, కొలుస్తూ అత్తవారింట వుండేది.

అన్నదమ్ములు నలుగురిలోనూ పెద్దవాడు భద్రయ్య. అతని భార్య సుందరమ్మ. చాలా గయ్యాళి. తన పట్టుదల నెగ్గించుకొనేందుకు తరుచు అన్నం నీళ్లు మానేసేది. భద్రయ్య భార్యచేతిలో కీలుబొమ్మ. భార్య మనస్సు ఎక్కడ నొచ్చుతుందోనని భయం. అందువల్ల భార్య ఆడించినట్లల్లా ఆడేవాడు.

ఒకరోజున భద్రయ్య యింటికి వచ్చేటప్పటికి సుందరమ్మ ముసుగు పెట్టి పెద్దగా మూలుగుతూ పడుకొనివుంది. భద్రయ్యను చూచి "నా తల నొప్పితో పగిలిపోతోంది. ఇది తగ్గాలి అంటే ఒకటే మందువుంది. నీ చెల్లెలు కల్యాణి నెత్తురు తీసుకువచ్చి నా కణతలకు పూస్తే నొప్పిపోతుంది. నేను బ్రతకటం నీకుయిష్టమైతే యీపని వెంటనే చెయ్యి" అంది సుందరమ్మ.

మర్నాడు తెల్లవారుఝామునే బయలుదేరి భద్రయ్య, చెల్లెలు అత్తవారిగ్రామం చేరాడు. కల్యాణి భర్త గ్రామాంతరం వెళ్లాడు. రాకరాక తన యింటికి అన్న వచ్చినందుకు కల్యాణి ఎంతో సంతోషించింది. పంచభక్ష్య పరమాన్నాలతో భోజనంపెట్టింది. భోజనమైనాక భద్రయ్య చెల్లెలితో "మీ వదినె తలనొప్పితో చాలా బాధపడుతున్నదమ్మా. నిన్ను చూడాలని కలవరిస్తోంది. నిన్ను తీసుకొని వెళ్లాలని వచ్చాను" అని అన్నాడు.

ఏ. పిచ్చయ్య, నెల్లూరు





వదిన అనారోగ్యంగావున్న సంగతి విని కల్యాణి ఎంతోవిచారపడి అన్నతో బయలు దేరింది.

మార్గమధ్యంలో భోజనం చేద్దామని కొలనుకు ప్రక్కనేవున్న ఒక చెట్టునీడను అన్నా చెల్లెలూ ఆగారు. భోజనం చెయ్య బోయేముందు భద్రయ్య "భోంచేసేప్పుడు ఒక్క మెతుకుగూడా క్రింద పడకూ డదు. అట్లా పడితే నీ తల నరకవలసి వస్తుంది" అన్నాడు.

"అలాగే. కాని నరికినప్పుడు కాళ్లు, చేతులు, తల విడివిడిగా పారవేయి" అన్నది కల్యాణి.

కల్యాణి ఎంత జాగ్రత్తగా భోంచేసినా ఒక మెతుకు కింద పడనేపడింది. మెతుకు కింద పడగానే భద్రయ్య కత్తి నితీసి కల్యాణిని నరికి ఆ నెత్తురు తీసుకొనివెళ్లి సుందరమ్మ కణతలకు పూశాడు. సుంద రమ్మకు నిజంగా తలనొప్పి వుంటేగదా! నెత్తురు పుయ్యగానే సుందరమ్మ తలనొప్పి మాయమయి పోయింది. తనకోర్కె తీర్చి నందుకు మొగుణ్ణి ఎంతో మెచ్చుకుంది.

ఇక్కడ కల్యాణిభర్త యింటికి వచ్చి భార్య ఎక్కడా కనపడక పోవటంవల్ల, అన్న లెవరింటికైనా వెళ్లివుంటుందని అనుకుని, ఏఅన్నయింటికి వెళ్లిందో తెలుసు కునేందుకు బయలుదేరాడు.

మార్గమధ్యంలో పూర్వం యెప్పుడూ లేనటువంటి వనమూ, నాలుగుస్తంభాలూ, ఒక కొలను, కొలను ఒడ్డునే పండిన మామిడిపండుగల ఒక మామిడిచెట్టు కని పించాయి. కల్యాణియొక్క కాళ్లూచేతులే- స్తంభాలు, పొట్ట-కొలను, శిరస్సే-మామిడి పండుగా మారినాయని పాపం అతనికేం తెలుసు!

అసలే ప్రయాణం చేసిచేసి అలసి ఆకలితో వున్నాడేమో తిందామని మామిడి





పండును కొయ్యబోయాడు. అప్పుడు మామిడిపండు యీ విధంగా పాడింది..

"పట్టక పట్టక ఓ స్వామీ
పట్టిన చేతులు ఓ స్వామీ
అన్యాయముగ నీ మరది
అడవిలొ నన్ను నరికాడు!"

పండు పాటపాడటం విని భద్రయ్యకు ఆశ్చర్యంతోపాటు భయంకూడా కలిగి త్వరత్వరగా నడక సాగించాడు.

కల్యాణి భర్త మొట్టమొదట భద్రయ్య యింటికి వెళ్లి కల్యాణి విషయమై ప్రశ్నించాడు. భద్రయ్య తనకేమీ తెలియనట్లు "అబ్బే, మా యింటికి రానేలేదే. ఎక్కడికి వెళ్లివుంటుందో?" అన్నాడు.

అప్పుడు కల్యాణిభర్త తను కల్యాణిని వెతుక్కుంటూ రావటం, మార్గమధ్యంలో కొత్తగా ఒకవనం వెలియటం, మామిడి పండు పాటపాడటం అన్నీ వర్ణించి బావ మరిది అయిన భద్రయ్యకు చెప్పాడు.

ఈ సంగతులు గ్రామం అంతటికీ తెలిసిపోయినాయి. "పండిన మామిడిపండు పాట పాడుతోందిట! యిదేం విచిత్రమో చూద్దాం పదండి" అని గ్రామప్రజ అంతా బయలుదేరింది. అందరితోపాటు భద్రయ్య సుందరమ్మ కూడా వెళ్లారు.

మామిడిచెట్టును సమీపించి పండిన మామిడిపండును ఎవరు పట్టుకోబోయినా పండు యిట్లా పాడటం మొదలుపెట్టింది.

"పట్టక పట్టక ఓ అయ్యా
పట్టిన చేతులు ఓ అయ్యా
అన్యాయముగ మా అన్న
అడవిలొ నన్ను నరికెనయా"

భద్రయ్యకూడా పండును పట్టుకోబోగా యిట్లా పాడింది.

"పట్టక పట్టక ఓ అన్నా
పట్టిన చేతులు ఓ అన్నా
అధర్మ మనియైనా యెంచక
అడవిలొ నన్ను నరికితివి!"

సుందరమ్మ పండును పట్టుకొనబోగా యిట్లా పాడింది.

"పట్టక ; ట్టక ఓ వదినా
పట్టిన చేతుల ఓ వదినా
అన్యాయంగ మా జన్నునుబంపి
అడవిలోన నను నరికించితివి!"

వేడుక చూద్దామని వచ్చినవారందరికీ భద్రయ్యా సుందరమ్మలే కల్యాణిచావుకు కారణమని పండిన మామిడిపండు పాట వలన తెలిసిపోయింది. అందరూ భద్రయ్యా సుందరమ్మల్ని చుట్టుముట్టి దేహశుద్ధి చేసేందుకు సిద్ధపడ్డారు. అప్పుడు భద్రయ్యా సుందరమ్మలు తమ తప్పును ఒప్పుకొని పశ్చాత్తాపంతో పండును పట్టుకొని "కల్యాణీ, పతివ్రతా శిరోమణీ! మేము యేంచేస్తే నువ్వు మామూలు మనిషివిగా అవుతావో చెప్పవమ్మా తల్లీ?" అని ప్రార్థించారు. అప్పుడు పండిన మామిడిపండు యిలా పాడింది.

"వనములో చెట్లన్ని కొట్టివేయండి
మినుముట్ట సాంబ్రాణి ధూపమేయండి
క్షణములో నేను కల్యాణి నౌతాను!"

పండు పాడినప్రకారం వనములో చెట్లన్నీ కొట్టివేసి, ఆకాశం అంటేటట్లు సాంబ్రాణి ధూపం వేశారు. అప్పుడు పండు యిలా పాడింది.

"మైమరచి నే పెద్ద నిద్ర పోయాను
పండుగానూ మారి పాటపాడాను
నిద్రనుంచీ తిరిగి మేలు కున్నాను
కల్యాణినై మరల కలుసుకొన్నాను!"

ఇలా పాడుతూ పండు ఒక్కసారిగా కల్యాణిగా మారింది. ఆతురతతో దిగులుతో యెదురుచూస్తున్న భర్తవద్దకు వెళ్లి, అతని పాదాలకు నమస్కరించింది కల్యాణి.

భద్రయ్యా సుందరమ్మా తలలు వాల్చారు. అందరూ ఆనందంతో జైజై ధ్వనులు చేశారు.






చుట్టు చక్కందమ్మ చక్కిలపు చుట్టు
చూలింత చక్కంది ఓ రాచదేవి
పండు చక్కందమ్మ పనసయ్య పండు
బాలింత చక్కంది ఓ రాచదేవి
ఆకు చక్కందమ్మ తామల్లపాకు
అయిదువ చక్కంది ఓ రాచదేవి
కొమ్మ చక్కందమ్మ గోరింట కొమ్మ
కొమరాలు చక్కంది ఓ రాచదేవి
పోక చక్కందమ్మ బొబ్బిల్లి పోక
బోగపు చక్కంది ఓ రాచదేవి.



చిలుకల్లు చిలుకల్లు అందురే కాని
చిలకలకు రూపేమి ? పలుకులేగాని
హంసల్లు హంసల్లు అందురే కాని
హంసలకు రూపేమి ? ఆటలేగాని
కోయిల్లు కోయిల్లు అందురే కాని
కోయిలలకు రూపేమి ? పాటలేగాని
చిలుకల్లు మాయింటి చిన్నకోడళ్లు
హంసల్లు మాయింటి ఆడపడుచల్లు
కోయిళ్లు మాయింటి కొత్తకోడళ్లు

వండరా రండమ్మ పిండివంటల్లు
వల్లభుడు అబ్బాయి వడుగు మాయింట
పెట్టరా రండమ్మ పెళ్లిముగ్గుల్లు
వల్లభుడు అబ్బాయి పెళ్లి మాయింట

కొత్త చింతపండు గోనెల్లో చివుకు
గొడ్రాలి వస్త్రాలు పెట్టెల్లో చివుకు
దేవదారువుచెక్క చెట్టున్న చివుకు
దేవుడు వస్త్రాలు గుళ్లోను చివుకు
రావిచెట్టూ చెక్క రంపాన చివుకు
రంభ చక్కాదనము దుఃఖాన చివుకు

కొడుకుల కనని వాళ్ల కడుపేమి కడుపు?
కులముద్ధరించనీ కొడుకేమి? కొడుకు?
పిడికెడు వితనాలు మడికెల్ల చాలు
వక్కడే కొడుకైన వంశాన చాలు

లాభమ్ము లాభమ్ము ఏమి లాభమ్ము?
కొడుకులగంటేను కోటి లాభమ్ము
వీధిలో వుయ్యాల అమ్మ వచ్చిందీ
కొడుకులగన్న తల్లి కొనవె వుయ్యాల.

సంపాదన : దీవి భానుమతీదేవి.



అబ్బాయిలూ! పై బొమ్మలో మధ్యని రెండుగీతలు అడ్డంగా గీసిఉన్నై.
ఆ రెండు గీతలు సరిగ్గా ఉన్నయ్యో వంకరగా ఉన్నయ్యో కనుక్కోండి.



పై చదరం మధ్యనివున్న పళ్లు తినాలని ఎలుక చూస్తుంది. ఏ దారిన
వెడితే ఆ పళ్లు వున్నచోటికి చేరుకోగలదో ఎలుకకు చూపించండి.





# రత్నాలమ్మ - వరహాలమ్మ



అనగనగా ఒక అడవి. ఆ అడవినిండా రకరకాల చెట్లు. వాటిలో ఒకచెట్టుమీద పిచికమ్మ,పిచికయ్యా గూడుకట్టుకుని వుంటున్నారు. పిచికమ్మకి అయిదుగురు మొగపిల్లలూ, యిద్దరు ఆడ పిల్లలు. మొగపిల్ల లన్నిటికీ పెళ్లిళ్ళు అయినై. పిచికమ్మకీ, పిచికయ్యకీ మగ పిల్లలమీదకంటె ఆడపిల్లలమీదనే ఎక్కువ యిష్టంగా వుండేది. పుట్టుకతోనే అవి చాల అందంగా పుట్టాయి. వాటి అందాలకు తగినట్లుగానే పెద్దపిల్లకి వరహాలమ్మ అనీ, చిన్నపిల్లకు రత్నాలమ్మ అనీ పేర్లు పెట్టి ఎంతో ముద్దుగా, గారాబంగా పెంచు తుండేది, పిచికమ్మ.

ఇంట్లో యింతమంది అన్నలూ, వదినలూ వున్నా మన రత్నాలమ్మ, వరహాలమ్మా వాటితో కలిసిమెలిసి తిరిగేవికావు. ఇల్లువదిలి అడివిలోకిపోయి తిరుగుతూ వుండేవి. రత్నాలమ్మనివిడిచి వరహాలమ్మ ఒక్క క్షణంకూడా వుండేదికాదు. అట్లాగే రత్నాలమ్మకూడా అక్కనివిడిచి ఒక్క నిమిషం వుండేదికాదు. ఎక్కడికిపోయినా రెండూ కలిసి పోతుండేవి.

ఇట్లావుంటుండగా ఒకరోజు మన రత్నాలమ్మా వరహాలమ్మా ఆడుకుంటూ, పాడుకుంటూ, అడివిలో తిరుగుతూ చాలదూరం పోయినై. అలా పోయి పోయి చివరికి అడివిదాటినై. ఆ అడివి ప్రక్కనే ఒక రాజుగారి మేడవుంది. మన రత్నాలమ్మా వరహాలమ్మా రాజుగారి తోటలోకిపోయి అక్కడ గంతులేస్తూ ఆడుకుంటున్నై.

మేడమీద పచార్లుచేస్తున్న రాజు వాటిని చూశాడు. వరహాలమ్మ అందం చూసే సరికి రాజుకి దాన్ని ఎల్లాగైనా పట్టితెప్పించా లనిపించింది. వెంటనే సేవకుణ్ణి పంపాడు వరహాలమ్మని పట్టుకురమ్మని.

మన రత్నాలమ్మా, వరహాలమ్మా వాటి ఆనందంలో అవివున్నై. సేవకుడు వచ్చి

స. రామచంద్రరావు, రాజమండ్రి.



కటిక్కాన వరహాలమ్మని పట్టుకుని రాజు దగ్గిరికి తీసుకుపోయాడు. రాజు దాన్ని ముద్దుగా పెంచుతున్నాడు.

రత్నాలమ్మ చేసేదిలేక ఏడుస్తూ యింటికి తిరిగొచ్చి, బియ్యం ఏరుతున్న తల్లితో, యిలా పాడుతూ చెప్పింది:

"అమ్మా, అమ్మా, విన్నావా,
ఎంతటి ఘోరం జరిగిందో!
అక్కా నేనూ ఆడుతువుంటే
బుఱ్ఱమీసముల బూచోడొకడు
వక్కసారిగా వరహాలమ్మని
బుట్టలొవేసుకు పోయాడు!"



ఇది వినగానే పిచికమ్మకి మూర్ఛవచ్చి పడిపోయింది.

రత్నాలమ్మ ఏడుస్తూ అడవిలో పుల్లలు ఏరుతున్న తండ్రిదగ్గిరికివచ్చి ఇలాపాడింది.

"అయ్యా, అయ్యా, విన్నావా,
ఎంతటి ఘోరం జరిగిందో!
అక్కా నేనూ ఆడుతువుంటే
బుఱ్ఱమీసముల బూచోడొకడు
వక్కసారిగా వరహాలమ్మని
బుట్టలొవేసుకు పోయాడు!
అన్ని సంగతులు అమ్మకు చెప్పా,
వింటూ వింటూ విరుచుకుపడ్డది."

ఇది వినేసరికి పిచికయ్యాకూడా అలాగే తెలివితప్పి పడిపోయాడు.

రత్నాలమ్మ ఏడుస్తూ ఒక నీళ్లగుంటలో ఆడుకుంటున్న అన్నలదగ్గిరికిపోయి యిలా పాడింది!

"విన్నారా వో అన్నాయిలూ,
ఎంతటి ఘోరం జరిగిందో!
అక్కా నేనూ ఆడుతువుంటే
బుఱ్ఱమీసముల బూచోడొకడు





వక్కసారిగా వరహాలమ్మని
బుట్టలోవేసుకు పోయాడు!
ఆ సంగతినే అమ్మకు చెప్పా,
వింటూ వింటూ విరుచుకుపడ్డది!
ఆవార్తను నే అయ్యకుచెబితే
ఆయనకూడ పడిపోయాడు.

ఇది వినేసరికి వరహాలమ్మ అన్నలు కూడా గుంటలోవాళ్లు గుంటలోనే తెలివి తప్పి పడిపోయారు.

తర్వాత రత్నాలమ్మ వదినెల దగ్గిరికి వచ్చి యిలా పాడింది :

"విన్నారా ఓ వదినెల్లారా
ఎంతటిఘోరం జరిగిందో!
అక్కా నేనూ ఆడుతువుంటే
బుఱ్ఱమీసముల బూచోడొకడు
వక్కసారిగా వరహాలమ్మను
బుట్టలోవేసుకు పోయాడు!
ఆసంగతి నే అమ్మకు చెప్పా
వింటూ వింటూ విరుచుకుపడ్డది!
ఆవార్తను నే అయ్యకు చెబితే
ఆయనకూడా పడిపోయాడు!
అన్నిసంగతులు నే అన్నయ్యలకు
చెప్పగానే ఇకనేం చెప్పేది
వారూకూడా పడిపోయారు!

ఇది వినేసరికి రత్నాలమ్మ వదినెలుకూడా మూర్ఛపోయారు.

ఇలా అంతా మూర్ఛపోయేసరికి రత్నాలమ్మకు ఏం చెయ్యాలో తెలియలేదు. ఏడుస్తూకూచుంది. కాని అలా కూచుంటే మరి తిండెట్లా. అందుకని రత్నాలమ్మ ఒక టెంకాయచిప్ప పుచ్చుకుని అడవిదాటి రాజుగారువున్న పట్నానికి వెళ్లింది అడుక్కోటానికి. అడుక్కుంటూ యిలా పాడుతూ వీధులన్నీ తిరిగింది :





అమ్మల్లారా, అయ్యల్లారా
విన్నారా మీరీ ఘోరం!
అక్కకు కలిగిన యిక్కట్టును నే
ఆదుర్దాతో అమ్మతొ చెబితే,
వింటూ వుండే విరుచుకుపడ్డది!
అది యంతా మా అయ్యకు చెబితే
ఆయనకూడా పడిపోయాడు!
అన్నలకూ యీ వార్తలు చెప్పా
అన్నలుకూడా అణగిపోయిరీ!
తిరిగి వచ్చి మా వదినెలకు చెప్పా
వదినెలుకూడా వొరిగిపోయిరీ!
అమ్మల్లారా, అయ్యల్లారా,
విన్నారా మీరీ ఘోరం!
దిక్కుమాలినా పక్షినైన నా
కొక్కగింజ ముష్టెయ్యండీ!

ఈపాట వినేసరికి పట్నంలోవున్నవాళ్లకి జాలి వేసింది. అంతా తలో గుప్పెడు గింజలుతెచ్చి రత్నాలమ్మకు వేశారు. రత్నాలమ్మ అలా అడుక్కుంటూ రాజు గారి మేడదగ్గిరికికూడా పోయి మేడకెదురుగుండా నుంచుని వెనకటి మాదిరిగానే మళ్లీ పాడింది.

ఈపాట మేడలో వుంటూన్న వరహాలమ్మ విన్నది. రత్నాలమ్మ గొంతు వెంటనే పోల్చుకో గలిగింది. వెంటనే ఒక గిద్దలో బియ్యం పోసుకుని రత్నాలమ్మ దగ్గిరికి వచ్చింది. వరహాలమ్మని చూడగానే రత్నాలమ్మకు ప్రాణం లేచివచ్చింది. అమాంతం వరహాలమ్మని పట్టుకుని గూటికి ఒక్క పరుగునవచ్చి చేరి యిలా పాడటం మొదలుపెట్టింది :

అన్నల్లారా, ఒదినెల్లారా
అమ్మా, అయ్యా లేవండోయ్!
వరహాలమ్మా వచ్చేసింది!!

రత్నాలమ్మ యిలా పాడగానే, పిచికమ్మ లేచి కూచుంది. అడవిలో పుల్లలేరుతున్న పిచికయ్య పరుగున గూటికివచ్చాడు. అన్నలు వచ్చారు. వదినెలూ లేచారు. అంతా ఆనందంతో అడవి అంతా మారు మ్రోగేట్లుగా పాడసాగారు. కథ కంచికి వెళ్లింది మన మింటికివచ్చాం.






ర్వం ఒక దేశంలో ముగ్గురు దొంగలు వుండేవాళ్లు. ఒకడిని మించిన గజదొంగ యింకొకడు.

ఒకరోజున దొంగలు ముగ్గురూ ఒక పూటకూళ్ల ఇంటిలో కలుసుకున్నారు. ముగ్గురూ ఒకే వృత్తి కలవాళ్లేమో యిట్టే స్నేహితులయ్యారు. ఇక ఎవడి గొప్ప వాడు చెప్పుకోవటం మొదలుపెట్టారు.

మొదటి దొంగ "నేను గూటిలోనుంచి అది పొదిగేగుడ్లను, పిట్టకుగూడా తెలియకుండా గుడ్లను దొంగిలించుకు వస్తాను" అన్నాడు.

రెండవ దొంగ "మనుష్యులు రోడ్డుమీద నడుస్తున్నప్పుడు వాళ్ల చెప్పులకు అడుగున వుండే అట్టలను కోసుకుని రాగలను" అన్నాడు.

ఇక మూడవ దొంగ "అన్నం తింటూ వున్నప్పుడు పక్కవాడికి తెలియకుండా వాడి కంచంలోని వస్తువులు నాజేబులో వేసుకుని రాగలను" అన్నాడు.

దొంగలు ముగ్గురూ ఒకరోజున కలిసి యిట్లా అనుకున్నారు: "ఎంత తెలివిగా దొంగతనాలు చేస్తున్నా ఎప్పుడో ఒకప్పుడు పోలీసువాళ్లు మనల్ని పట్టుకోకుండా వదలిపెట్టరు. పట్టుబడ్డామంటే చచ్చేంతవరకు జైలులో వుండాలి. మన తెలివి వుపయోగించి రాజుగారిదగ్గర ఏవన్నా నౌఖరీలు సంపాదించుకుంటే యీ అవస్థవుండదు."

ఇట్లా అనుకొని దొంగలు ముగ్గురూ రాజుగారి నగరానికి ప్రయాణమై వెళ్లారు.

రాజధానిచేరి దొంగలు ఒక సత్రంలో దిగారు. రాజును చూడాలంటే వుత్త చేతుల్తో వెళ్లకూడదు. అందుకోసం "రేపు మధ్యాన్నంలోపల ముగ్గురం మూడు విలువైన వస్తువుల్ని సంపాదించుకుని రావాలి" అనుకుని బయలుదేరారు.

మొదటి దొంగ రాజుగారి తోటలో ప్రవేశించాడు. రాజుగారు ఎంతో ముద్దుగా పెంచుకుంటూన్న నెమలి ఒకటి ఆతోటలో

బి. జయలక్ష్మి, మద్రాసు



ప్రధాన మంత్రి ఒక లావాటిఆయనగూడా వున్నాడు. ఆయన తొడుక్కున్న చెప్పులకి అడుగునవుండే అట్టలని దొంగ కోసివేసి తీసుకుని వెళ్లిపోయినాడు.

రాజుగారు వచ్చి సింహాసనం మీద కూర్చున్నతర్వాత మంత్రులు ఒక్కొక్కరు వెళ్లి మోకాళ్ళమీద కూర్చుని నమస్కారం చేశారు. ప్రధానమంత్రిగూడా అట్లా చేస్తూ వుంటే ప్రక్కనే నిలబడివున్న వాళ్లంతా గుసగుసలు, నవ్వులు మొదలుపెట్టారు. రాజుకి మంత్రి కాళ్లకున్న చెప్పులకి అట్టలు లేవని తెలిసిపోయింది. తన్ను అవమానం చేసేందుకే మంత్రి అడుగున అట్టలులేని చెప్పులతో వచ్చాడని రాజుకు కోపం వచ్చింది. రేపు సాయింత్రంలోపల తన ఈ అవిధేయతకు కారణం చెప్పకపోతే మంత్రిని చంపివెయ్యమన్నాడు.

మూడవ దొంగ రాజుగారి భోజనశాల జేరాడు. రాజువచ్చి భోజనానికి కూర్చున్నాడు. వంటవాళ్లు పళ్ళేలలో రాజుగారికి వడ్డించాలని లడ్డూలు, కజ్జికాయలు తెచ్చారు. దొంగ ఎవరికీ తెలియకుండా వాటిల్లో మూడువంతులు తన జేబుల్లో వేసుకుని వచ్చేశాడు.

వుంది. నెమలి గ్రుడ్లను పొదుగుతూ వుండటం చూచి దొంగ వాటిని జేబులో వేసుకుని వచ్చేశాడు.

నెమలి గ్రుడ్లు పోయినట్టుగా రాజుకు తెలిసింది. తోట కాపలాదార్లమీద ఎంతో కోపంవచ్చింది. రేపు సాయింత్రం లోపల ఆ గ్రుడ్లను తీసుకొనివచ్చి యివ్వకపోతే అందరినీ చంపివెయ్యిం డన్నాడు.

రెండవ దొంగ రాజుగారి రహస్యాలోచనా మందిరాన్ని జేరాడు. మంత్రులందరూ రాజుగారికోసం ఎదురుచూస్తూ యిటూ అటూ పచార్లుచేస్తున్నారు. వాళ్లలో

రాజుకి ఆకలి దహించుకుపోతోంది. ఇంకా కొంచెం తీసుకొనివచ్చి వడ్డించమంటే అక్కడేం వున్నాయి? వంటవాళ్ళంతాజేరి తనకడుపు కాలుస్తున్నారని రాజుకు చెడ్డ కోపంవచ్చింది. రేపు సాయంత్రం వంటవాళ్లందరినీ చంపివెయ్యమన్నాడు.

మర్నాడు మధ్యాన్నం రాజు కొలువు తీర్చాడు. మన దొంగలు ముగ్గురూ తాము సంపాదించిన వస్తువులతో హాజరయ్యారు.




రాజు "నిన్న కాపలాదార్ల అశ్రద్ధవలన తోటలోవున్న నెమలిగ్రుడ్లు కాస్తా పోయినాయి. ప్రధానమంత్రి చెప్పులకి అడుగున అట్టలులేకుండా సభకువచ్చాడు. వంటవాళ్లు నాకు సరిపడేటన్ని పిండివంటలు చెయ్యలేదు. అందువల్ల వీళ్ళందిరినీ యీరోజు సాయింత్రం చంపివెయ్యమని ఆజ్ఞయిచ్చాను. నిన్న యిట్లా జరగటానికి ఏవో కారణాలు వుండి వుండాలి. అవినాకు తెలియజేసినవాళ్లకి గొప్ప బహుమానం యిస్తాను. ప్రధానమంత్రి మొదలైనవాళ్లకి శిక్షలేకుండా చేస్తాను" అన్నాడు.

అప్పుడు దొంగలు ముగ్గురూ రాజుగారి పాదాలవద్ద నెమలిగ్రుడ్లూ, చెప్పుకి అడుగునవుండే అట్టలూ, లడ్లు, కజ్జికాయలూ వుంచి జరిగిన సంగతంతా చెప్పారు. పైగా మాటయిచ్చిన ప్రకారం బహుమతి యివ్వమని రాజుని అడిగారు.

దొంగల సాహసానికి రాజుకు ఎంతో ఆశ్చర్యంకలిగి "మాటయిచ్చినప్రకారం బహుమానం యిచ్చేందుకు నాకేం అభ్యంతరంలేదు. మీరుచేసిన పనికి న్యాయప్రకారం మిమ్మల్ని శిక్షించవలసి

 

వుంటుంది. కాని నేనుచెప్పేపని ఒకటి మీరుచేస్తే మిమ్మల్ని క్షమించి బహుమానం యివ్వటమే కాకుండా పెద్ద వుద్యోగాలు కూడా యిస్తాను" అన్నాడు.

"అట్లాగే, ఆ పనేదో చెప్పండి" అన్నారు దొంగలు.

"రేపు ప్రొద్దుటికి నా కోశాగారం నుంచి మూడు మణులను దొంగతనంచేసి తీసుకురావాలి. అలా తీసుకురాలేకతే మీ తలలు ఖండిస్తాను" అన్నాడు రాజు.

దొంగలు వాళ్ళలో వాళ్లు మాట్లాడుకొని రాజుతో, "అట్లాగే, కాని మేంతెచ్చే మూడు మణులూ మీ కోశాగారంనుంచే తెచ్చామని మీకు నమ్మకం కలుగక పోవచ్చు. అందు వల్ల మొత్తం ఎన్నిమణులున్నాయో లెక్క పెట్టి వుంచమనండి. మేము రేపు మీకివ్వగా మూడు మణులు మొత్తంలో తగ్గివున్నట్టయితే మీరు తేలిగ్గా దొంగతనం జరిగిందని నమ్మవచ్చు" అన్నారు.

రాజు సరేనని కోశాధికారితో సాయింత్రం లోపల వున్న మణులన్నీ లెక్కపెట్టి వుంచమన్నాడు.

రాజుగారి కోశాగారంలో సంచులకొద్దీ మణులున్నాయి. అన్నీలెక్కపెట్టటం ఒక్క మనిషివల్ల అయ్యేపనికాదు. అందువల్ల రాజుగారివద్ద పెద్ద వుద్యోగంచేసే వాళ్ళందర్నీ మణులు లెక్కపెట్టేందుకు రమ్మని కోశాధికారి అడిగాడు.

మన దొంగలు ముగ్గురూ వుద్యోగస్తుల వేషాలు వేసుకుని అందరిలో కలిసిపోయి కోశాగారం లోకివెళ్లి దొంగతనం చేశారు.

మర్నాడు వుదయం రాజుచేతికి దొంగలు మూడుమణులు యిచ్చారు. కోశాగారానికి కబురు పంపించి కనుక్కుంటే నిన్నటి కన్న యీరోజు మూడు మణులు తగ్గాయి అని తెలిసింది.

రాజు సంతోషించి దొంగలు ముగ్గురికీ పెద్ద పెద్ద బహుమతులివ్వటమేగాకుండా వుద్యోగాలుకూడా యిచ్చాడు.





# తగిన శాస్తి



పూర్వం మధురానగరాన్ని జయపాలు డనే రాజు పాలించేవాడు. అతనికి రాచ కురుపు లేచింది. ఎంతోమంది వైద్యులు వచ్చి అతనికి మందులిచ్చారు. ఊహుఁ. నయంకాలేదు. ఆఖరికి విసుగెత్తి ఈమాటు ఏ వైద్యుడన్నావచ్చి తనకు మందిచ్చి నయంచేయలేకపోతే వాడితల తీయిస్తా నన్నాడు. ఆనాటినించీ ధైర్యంచేసి ఏ వైద్యుడూ అతనిదగ్గరికి రాలేదు.

ఇలా కొంతకాలం గడిచింది. ఒకనాడు కళింగదేశంనించి ఒకవైద్యుడువచ్చి రాజు గారి జబ్బు నయంచేస్తానని కబురుచేశాడు. మంత్రులు వృథాగా ఎందుకు చస్తావని అతనికి ఎంతో చెప్పారు. అయినా కళింగ వైద్యుడు ససేమిరా అన్నాడు.

రాజుగారికి ఈ సంగతి తెలిసి వైద్యం చేయటానికి రమ్మన్నాడు. కళింగవైద్యుడు ఏదో ఆకుపసరు తీసుకువచ్చి రాజుగారి కురుపుమీద రాచాడు. తర్వాత ఏవో రంగు రంగుల పూలు ఆ కురుపుమీద వేసి కట్టాడు.

ఆ మరుసటిరోజునించే రాజుకి కురుపు బాధ తగ్గుతున్నట్టనిపించింది. అదివరకు వుంటున్న పోట్లు, మంటలు తగ్గసాగినై. సరిగ్గా వారంరోజులన్నా పూర్తికాకమునుపే రాచకురుపు మానిపోయింది. అసలు కురుపులేచినట్లు అనమాలైనా లేకుండా పోయింది.

రాజుకి ఎంతో సంతోషంకలిగింది. కళింగవైద్యుణ్ణి ఆరోజుమొదలు తన ఆస్థాన వైద్యుడుగా వుండమని కోరాడు. సరే నన్నాడు కళింగవైద్యుడు.

మరికొన్ని రోజులకి రాణికి జబ్బు చేసింది. కళింగవైద్యుడు ఆమె జబ్బుని మూడుపూటల్లో నయంచేశాడు. ఇది చూసిన దగ్గిర్నించీ రాజుకి కళింగవైద్యుడి మీద అభిమానం, నమ్మకం ఇంకా ఎక్కువ కాసాగినై. ఏపనిచేసినా, కళింగవైద్యుడి సలహా తీసుకోందే చేసేవాడు కాదు. ఎక్కడికి వెళ్లినా కళింగవైద్యుణ్ణికూడా వెంట తీసుకువెళ్లేవాడు.

ఇదంతా చూస్తూంటే మంత్రికి కళ్ళు కుట్టినై. "ఇలాగే మరికొన్నిరోజులు గడిస్తే, నా ఉద్యోగానికే ముప్పువస్తుంది. ఆ వైద్యుడినే మంత్రిగా చేసుకుంటాడు. అందుకని వీలైనంత త్వరగా కళింగ వైద్యుడిని చంపించితే మంచిది" అనుకు న్నాడు మంత్రి.

---

అనూరు త్రినాథ్, చికాకోలు.



ఇలా ఆలోచించుకుని ఒకరోజున మంత్రి రాజు ఒంటరిగావున్నప్పుడు పోయి యిలా చెప్పాడు — "మహారాజా! తమ రిప్పుడు ఆస్థానంలో వుంటున్న కళింగ వైద్యుడి మోసంలో పడిపోయారు. అతను నిజానికి మీ మేలుకోరి రాలేదు. అతను మన శత్రురాజ్యంనించి వచ్చిన గూఢచారి. మన రహస్యాలను కనుక్కొనిపోయి మన రాజ్యంమీద దండెత్తటానికి ఈ వేషం వేస్తున్నాడు. మీరు పాపం అతని మాయలో పడిపోయారు. మీ మంత్రిగావుండి మీమేలు కోరేవాడిని కనక ఈ సంగతి చెబుతున్నాను. ఇప్పటికైనా అతనినిత్వరగా పంపించివేస్తే మంచిది. తీరా ప్రాణాల మీదికి వచ్చిన తర్వాత విచారిస్తే ప్రయోజనముండదు ఇది నా సలహా. మీకు నచ్చితే అలా చెయ్యండి" అన్నాడు.

ఇది వినేసరికి రాజుకి చాల ఆశ్చర్యం వేసింది. తనచెవులని తానే నమ్మలేక పోయాడు. "ఎంతో ప్రమాదమైన నా రాచ కురుపు నయంచేశాడు. నా రాణికి జబ్బు చేస్తే, నేను అడగకుండానే ఏదో మందు యిచ్చి యిట్టే నయంచేశాడు. తర్వాత నా సోదరుడివలె నాతో తిరుగుతున్నాడు. అలాంటివాడు నన్ను మోసంచెయ్యటానికి చూస్తున్నాడంటే నేనెలా నమ్ముతాను మంత్రీ? ఏదైనా నిదర్శనవుంటే అలాగే నమ్ముతాను" అన్నాడు రాజు.

రాజు యిలా అంటాడని మంత్రి అదివరకే వూహించుకున్నాడు. అందుకని కళింగవైద్యుడు వ్రాసినట్లు ఏవో దొంగ వుత్తరాలు వ్రాసి తనతో తెచ్చాడు. రాజు యిలా అనగానే మంత్రి ఆ వుత్తరాలు చూపుతూ, "నిదర్శనాలకేమి తక్కువ. మీరు అలా అంటారనే నేను ఆ కళింగ వైద్యుడు మన శత్రురాజుకు వ్రాసి పంపుతున్న ఉత్తరాలని సంగ్రహించగలిగాను. ఇవిగో చూడండి" అన్నాడు.

రాజు ఆ వుత్తరాలు చూశాడు. మంత్రి చెప్పినదంతా నిజమేగదా అని నమ్మాడు. రాజుకి తగని ఆగ్రహం కలిగింది. "ఆ కళింగవైద్యుణ్ణి తీసుకురా వెళ్ళి" అన్నాడు రాజు మంత్రితో.

రాజు ఈ మాటలు అంటుండగానే కళింగవైద్యుడు రోజూలాగానే రాజు ఎదటికి వచ్చాడు. రాజు కళ్ళవెంట నిప్పులు గ్రక్కుతూ, "పాపాత్ముడా, నాయింట్లో అన్నంతిని నన్నే మోసంచెయ్య





పలుచుతున్నావా? స్నేహంగా వుంటూ యింత దుర్మార్గం తలపెడతావని నేను కలలోకూడా అనుకోలేదు. నువ్వు శత్రు దేశపు గూఢచారివనీ, మా రహస్యాలు కనుక్కునేందుకు యిలా మాయవేషంతో వచ్చావనీ మా మంత్రి చెప్పేవరకూ నాకు తెలియదు. ఇప్పుడు తెలిసింది. ఇక నిన్ను క్షమించేదిలేదు. నీవు చేసిన మోసానికి నీ తల నరికివేయటానికి ఆజ్ఞయిచ్చేశాను. కాని, నీవు చనిపోయేముందు ఏదైనా కోరిక వుంటే చెప్పుకో." అన్నాడు రాజు.

ఏ పాపమూ ఎరుగని కళింగవైద్యుడు యిది వినేసరికి తెల్లబోయాడు. కొంత సేపటికి తెప్పరిల్లుకుని—"మీ ప్రాణాలు తియ్యటానికి వచ్చినవాడినైతే మీకు వైద్యం చేసి బ్రతికించేవాడినేకాదు గదా. ఇంత మేలు మీకు చేసినాకూడా నన్ను మీరు అనుమానించారు. శిక్షకూడా విధించారు. ఇక నే చెప్పవలసింది ఏమీలేదు. ఒకవేళ చెప్పినా మీరు నమ్మేస్థితిలోలేరు. నా ఆఖరి కోరికమాత్రం ఒకటి వున్నది. రేపు సాయంత్రంలోగా నేను ఒక్కసారి నా పెళ్ళాం బిడ్డల్ని చూసుకు రావాలని వుంది. మీరు అనుమతిస్తే వెళ్లివస్తాను" అన్నాడు కళింగవైద్యుడు.

రాజు ఇందుకు ఒప్పుకుని యిద్దరు భటులవెంట కళింగ వైద్యుడిని పంపారు. ఈ సంగతి రాజ్యమంతా తెలిసింది.

మర్నాడు సాయంకాలం రాజ్యంలో ప్రజలంతా కళింగవైద్యుడి తల నరుకుతున్నారంటే చూద్దామని వచ్చారు.

కొంతసేపటికి కళింగవైద్యుడు, చంకలో ఒక లావుపాటి పుస్తకం పెట్టుకొని రాజు దగ్గిరికి తిరిగివచ్చాడు. "నా పెళ్ళాం బిడ్డల్ని చూసుకువచ్చాను. ఇక నాకు మరేమీ కోరికలేదు. మీరు నిశ్చయించుకున్నట్లు నా తల నరకవచ్చు. కాని ఒక చిన్నవిషయం మనవిచేసుకుంటున్నాను. ఈ గ్రంథం తమవద్ద వుంచుకోండి. నా తల నరికినతర్వాత పదినిమిషాలవరకూ నా తల మాట్లాడుతుంది. ఆ మాటల ప్రకారం మీరు చేస్తే నేను నిజంగా దోషిని అయినదీ లేనిదీ మీకే తెలుస్తుంది. మీకు ఆ సంగతి తెలియపర్చిన తర్వాతగాని నా ప్రాణి పోదు" అన్నాడు కళింగవైద్యుడు. సరేనని రాజు పుస్తకంపట్టుకుకూర్చున్నాడు. ప్రజలంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఇద్దరు భటులు కళింగవైద్యుడి తల నరికివేశారు. తల మొండెం విడివిడిగా నేలమీద పడిపోయినై.





తర్వాత తల యిలా మాట్లాడింది :— "రాజా! పదో పేజీలో పదకొండో పంక్తి చూడు" అని.

రాజు పేజీలు తిరగవెయ్యసాగాడు. కాని ఒకపేజీ మరోపేజీ అతికున్నట్లుగా వున్నై. అందుకని రాజు వేలికి నోటి ఎంగిలిచేసుకుని పేజీలు తిరగవేశాడు. పదో పేజీ వచ్చింది. అందులో ఏమీలేదు.

"ఈ పేజీలో ఏమీలేదే?" అన్నాడు రాజు.

"అయితే. సలభైనాలుగో పేజీలో పదహారోలైను చూడు" అన్నది తల.

రాజు మళ్లీ పేజీలు తిరగవేయసాగాడు. కాని వెనకటిలాగానే పేజీలు నోటి తడి చేసుకొందీ రావటంలా. అందుకని రాజు మళ్లీ వేళ్లకు నోటి ఎంగిలి చేసుకుని పేజీలు తిరగవెయ్యసాగాడు.

కళింగ వైద్యుడు రెండేసి పేజీలు కొద్దిగా అంటించి పేజీలమూలల్ని విషం పూసి తెచ్చిన సంగతి పాపం రాజుకేం తెలుసు? రాజు మాటిమాటికీ నోటి ఎంగిలి వ్రేళ్ళకు చేసుకుని పేజీలు త్రిప్పి మళ్ళీ ఆ వ్రేళ్లు నోట్లో పెట్టుకోటంవల్ల పేజీల చివర పూసిన విషం రాజు శరీరంలో ప్రవేశించింది. రాజు కాసేపటికి గిజగిజ తన్నుకొని చనిపోయాడు.

"యదార్థమిప్పుడు తెలిసిందా!" అంటూ తలకూడా పకపకనవ్వి కళ్ళుమూసుకుంది.

ఇదంతా చూస్తున్న ప్రజలు ఆశ్చర్య పోయారు. "పాపం, అన్యాయంగా ఆ వైద్యుడిని చంపినందుకు రాజుకి తగిన శాస్తి జరిగింది" అనుకుంటూ ఎవరిళ్ళకు వాళ్లు వెళ్లిపోయారు.









## ఆధారములు

**అడ్డము:**

1. సమావేశము.
3. తల్లి.
5. తెనాలి దగ్గర ఒక స్టేషను.
7. వ్యాజ్యము.
9. పతివ్రత.
10. అక్షరముల వ్రాత.
12. ఫిలింకు ఇది అవసరం.
15. కోతి.
17. సూర్యుడు.
19. సంతోషము.
20. దీనితో వాసనచూస్తాము.
21. సర్పము.

**నిలువు:**

1. కులాసా.
2. తగని ఆశ.
4. దోషములు.
6. చిన్న తీగ.
8. సుగ్రీవుని అన్న.
11. కోకిల.
13. ఖరీదు.
14. గుఱ్ఱము.
16. తర్వాత.
18. ఒకవైపు పెళ్లిసంబంధం.

12 వ పేజిలోని డేరాబొమ్మలకు జవాబు : 2, 8 నెంబర్ల డేరాలురెండు ఒకమోస్తరువి

క్రిందటిసారి కొంగ కోతిని కాలవ దూకమని మోసంచేసి
ఓడించింది. అందుకని కోతి కొంగపని పట్టాలనుకుంది.



కోతి ఒకడోలుతెచ్చి కూర్చుని వాయించింది.
కొంగని కూడా అలాగే వాయించమంది.



కొంగకూడా కూర్చుని కాళ్లతో వాయించింది.



ఈసారి కోతి డోలుని మెడకి తగిలించుకుని
వాయించి కొంగనికూడా అలాగే చెయ్యమంది.



సరేగదానని కొంగ డోలు మెడకి తగిలించుకుంది.
ఇంకేం పొడుగాటి సన్నని మెడ మెలికలు తిరిగిపోయింది.

ఫిబ్రవరి 26-వ తేదీనుంచి ప్రదర్శింపబడుతోంది

జైహింద్ టాకీస్ బెజవాడ * మినర్వాటాకీస్ రాజమండ్రి * గోపాలకృష్ణటాకీస్ ఏలూరు * పూర్ణథియేటర్ విశాఖపట్నం * సరస్వతీటాకీస్ గుంటూరు

**5-3-48 నుంచి**

మెజస్టిక్ సినిమా కాకినాడ

సత్యనారాయణటాకీస్ తెనాలి

పూర్ణథియేటర్ విజయనగరం

**29-3-48 నుంచి**

బృందావన్ టాకీస్ బందరు

గ్రాండ్ టాకీస్ కర్నూలు



ప్రతిభా వారి

# బాలరాజు

వరలక్ష్మి.. అంజలీదేవి.. నాగేశ్వరరావు
శివరావు...

ప్రొడ్యూసర్ డైరెక్టర్.. జి. బలరామయ్య

ఆంధ్ర, రాయలసీమకు:
పూర్ణా పిక్చర్సు,
బెజవాడ.

★

మైసూరుకు:
తల్లం పిక్చర్సు సర్క్యూట్
బెంగుళూరు సిటీ.

హైదరాబాదుకు:
దక్కన్ఫిలిం డిస్ట్రిబ్యూటర్సు
హైద్రాబాద్.

Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1.
Editors CHAKRAPANI and K. RAJA RAO



ఏడువకు! ఏడువకు! నా చిట్టిపాపా!
ఇప్పుడే వస్తాడు నీ గాంధిబాబా!





PRINTED AT THE B. N. K. PRESS. 37. ACHARAPPAN ST. MADRAS - 1